శ్రీరస్తు

శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్ర గ్రన్థమాలా

షష్ఠప్రసూనమ్.

శ్రీ

# పారమాత్మికోపనిషద్భాష్యమ్

సర్వతన్త్రస్వతన్త్రైః

భగవచ్ఛ్రీనివాసమఖి వేదాన్తదేశికై రనుగృహీతమ్

శ్రీమత్సున్దరరాజసూరికృత చన్ద్రికాఖ్యవ్యాఖ్యా సముపస్కృతమ్

శ్రీ శ్రీ భట్టభాస్కరకృత పారమాత్మికమన్త్రవ్యాఖ్యానోపేతశ్చ.



గ్రన్థోయమ్

తిరుపతి శ్రీనివాస సంస్కృత కలాశాలాధ్యాపకైః

" ఉభయ వేదాన్త ప్రవర్తకైః "

శ్రీమద్వైయాకరణ పఞ్చాననైః

రొంపిచర్ల భట్టర్ పార్థసారథికృష్ణమాచార్యవర్యైః

పణ్డిత ఉ॥ చ॥ శ్రీనివాసభట్టాచార్యైశ్చ

పరిష్కృతః

గ్రన్థమాలాసమ్పాదకః

ఉ॥ వే॥ శ్రీమాన్ భిషగ్రాట్

దీవి వేంకటనృసింహాచార్యః

వల్లూరు.



శ్రీవైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథమాలా సంపాదకులు

శ్రీమదిత్యాది శ్రీమా[illegible]గ్రా॥

దీవి వేంకటనృసింహాచార్యులు గారు



కీ॥ శే॥ శ్రీమదిత్యాది శ్రీమాన్

## నారాయణం వేఙ్కటాచార్యులు గారు

సంగంజాగర్లమూడి.

వీరి జ్ఞాపకార్థముగ కుమారులు ఆయుష్మాన్

శ్రీనివాసాచార్యులు, సత్యనారాయణాచార్యులుగారలు

గ్రంథమాలకు రూ. 300—0—0 లు నొసంగిరి.

శ్రీరస్తు

శ్రీమద్విఖనోమహాగురవే నమః

# ముద్రాపకప్రశస్తిః

గుంటూరుమణ్డలే కృష్ణవేణ్యాః పరిసరే శుభే
రమ్యాభజమ్బీరతామ్రాబలవల్లికాభి ర్విరాజితమ్॥ 1

సంగంజాగర్లమూడీతి ప్రథితం స్వైభవోన్నతమ్
చాతుర్వర్ణ్యసమాకీర్ణం బభౌ పురవరం మహత్ ॥ 2

విద్వద్భి ర్భాగ్యవద్భిశ్చ జ్ఞానిభిః సమలఙ్కృతమ్
శ్రీనివాసదయాశీతలేక్షణేక్షిత మన్వహమ్॥ 3

తస్మి న్విద్వజ్జనగణమనఃపఙ్కజహ్లాదశాలీ
సత్యైశ్వర్యస్థిరతరయశశ్చన్ద్రికాద్యోతమానః
శాన్తో దాన్త స్సకలయమినా మగ్రగో యాయజూకః
శ్రీమద్వైఖానసకులమణి ర్విద్యతే కృష్ణమార్యః ॥ 4

నారాయణాన్వయసుధాసధిశీతభానోః
శ్రీకృష్ణమార్యవిదుష స్తనయో మహాత్మా
గోష్ఠీపురేన్ద్రపదపఙ్కజచఞ్చరీకః
సౌమ్యాకృతి శ్శుచి రభూ త్కిల వేఙ్కటార్యః ॥ 5

తద్వేఙ్కటాచార్యవర్య స్సాన్ద్రశ్రితైకసురద్రుమః
కరుణారసనిర్మగ్నహృదయ స్స శుభోదయః 6

విశిష్టాద్వైతసిద్ధాన్తసారసాగరకుమ్భజః
నిత్యసత్యబలోపేత స్సకల స్సకలార్థదః ॥ 7

గీతాధ్యయనసమ్పన్నః పారమార్థికచిన్తనః
వేదశాస్త్రార్థదర్శీ చ బభూవ సుగుణాకరః ॥ 8

స మహాగుణసమ్పన్నాం వాత్సల్యైకవిభూషణామ్
అనిన్దితాచారవతీం శ్రీశక్త్యైశ్వర్యశాలినీమ్ ॥ 9

ధర్మానురాగసఙ్కీర్ణహృదయాం సద్యశోజ్జ్వలామ్
శ్రీమతీం సత్యవాగ్భూషాం సతీం శ్రీరఙ్గమామ్బికామ్ ॥ 10

జగ్రాహ విధివత్తస్యాం లేభే పుత్రావనిన్దితౌ
కుమారీం చ తయోర్ద్రిక్తామనవద్యగుణాన్వితామ్ ॥ 11

లక్ష్మీమితి దివ్యాభిఖ్యాం తాం లక్షితాం లక్షణైశ్శుభైః
జ్యేష్ఠః శ్రేష్ఠగుణోత్కృష్టః శ్రీనివాసపదాఙ్కితః ॥ 12

అష్టాక్షరమహామన్త్రజాపకః శ్రీమతాం వరః
వేదవేదాఙ్గతత్త్వజ్ఞః కరుణారసభూషణః ॥ 13

ద్వితీయస్సత్యనారాయణాచార్యస్సత్యవాక్ఛుచిః
హూణవిద్యాప్రభావజ్ఞస్సదా ధర్మపరాయణః ॥ 14

ఏతౌ శ్రీపారమాత్మీయభాష్యముద్రణకర్మణి
పితృపాదజ్ఞాపనార్థం రూప్యాణాం హి శతత్రయమ్ ॥ 15

అదాతాం మాతు రాజ్ఞానుపాలనే బద్ధదీక్షితౌ
శ్రీమద్వేఙ్కటరామార్యప్రేరణే నైవ సామ్ప్రతమ్ ॥ 16

ఏతద్వితరణోద్భూతయశఃపార్వణచన్ద్రికా
జయతాం జయతాం నిత్య మేతయో రనవద్యయోః ॥ 17

అవ్యాచ్ఛ్రీరఘునన్దనస్స భగవాన్ త్రైలోక్యనాథఃపరః
కల్యాణైకనికేతనః కలిహరస్సత్యప్రతిజ్ఞోదయః
సీతామానసపద్మలీనమధుపః కారుణ్యదుగ్ధామ్బుధి
స్సోఽతర్క్యస్సతతం కుటుమ్బసహితావేతౌ మహద్భిశ్శుభైః ॥ 18

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

## విన్నపము

సర్వతంత్రస్వతంత్రులగు శ్రీ శ్రీనివాసదీక్షితులవారిచేత ననుగ్రహింపఁబడిన శ్రీపారమాత్మికోపనిషద్భాష్యమును చంద్రికా వ్యాఖ్యానముతోడను. భట్టభాస్కరకృత పారమాత్మికమంత్రవ్యాఖ్యానముతోడను శ్రియఃపతియనుగ్రహముచే నేటికి శ్రీ వైఖానసభగవచ్ఛాస్త్రగ్రంథమాలయందు షష్ఠప్రసూనముగా ముద్రింపించి విద్వన్మండలి కందఁజేయునంతటి మహాభాగ్యము లభించినందులకై యెంతయు సంతసించుచున్నాఁడను.

ఇయ్యది యిలత్తూరు గ్రామవాస్తవ్యులగు శ్రీసుందరరాజభట్టాచార్యులవారిచే ననుగ్రహింపఁబడిన చంద్రికావ్యాఖ్యానసమేతముగా శ్రీవైఖానసమతసిద్ధాంతప్రవర్తక వాసుదేవాపరనామక రఘుపతిభట్టాచార్యులవారిచేఁ బరిశోధింపఁబడి తిరుక్కుడందైశ్రీ విద్యాముద్రాక్షరశాలయందు 1900 సంవత్సరమున గ్రంథలిపిలో ముద్రింపఁబడియున్నది.

మఱియు మద్రాస్ అడయార్ పుస్తకాలయాధ్యక్షులచే సంపాదింపఁబడి డాక్టర్ కుంజన్ రాజ మహాశయులచే సరిచూడఁబడి 1933 వ సంవత్సరమున నాగరలిపిలో ముద్రింపఁబడిన అప్రకాశోపనిషత్తులలో శ్రీ శ్రీనివాసదీక్షితకృత పారమాత్మికోపనిషద్భాష్యముకూడ గలదు. ప్రస్తుతము పై భాష్య మాంధ్రలిపిలో ముద్రించినయెడల నాంధ్రదేశీయు లందఱకును సుగ్రాహ్యముగ నుండునని తలంచి సంఘ సోదరులు ప్రోత్సహించుటచే శ్రీ-ఉ-వే-ప్ర-శ్రీమాన్ దేవయాజనం వేంకటరామాచార్యులవారు పైఁ బేర్కొనఁబడిన రెండు మాతృకలును, మఱికొన్ని దేశాంతరస్థ మాతృకలునుగూడఁ బరిశీలించి చంద్రికా భట్టభాస్కరీయవ్యాఖ్యానసమేతముగా దీక్షితీయ పారమాత్మికోపనిషద్భాష్యమును ముద్రణమున కనుకూల మగునట్లు విస్పష్టముగ వ్రాసి

పండితప్రకాండులగు శ్రీమద్వ్యాకరణపంచానన ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్. రొంపిచర్ల భట్టర్ పార్థసారథి కృష్ణమాచార్యులవారిచేత నున్ను ఉ॥ వే॥ ప్ర. శ్రీమాన్. పండిత, ఉ॥ చ॥ శ్రీనివాసభట్టాచార్యులవారిచేతనున్ను సరిచేయించి మాళంఢఁజేసియుండిరి.

కాని దురదృష్టవశమున గ్రంథమాలాస్థాపనకుఁ ప్రధానకారకులును ముద్రణాదివిషయములలో నత్యంతసహాయకులు నగు శ్రీ. ఉ. వే. ప్ర. శ్రీమాన్ తిమిరిశ పానకాలాచార్యులవారు పరమపదించుటచే ముద్రణవిషయములోఁ గొంత యంతరాయము వాటిల్లినది; కాని వారిపుత్రులగు శ్రీమాన్, శ్రీనివాసాచార్యుల వారున్ను మఱి కొందఱు యువకులున్ను ముద్రణవిషయములోఁ గొన్ని సాయములొనర్చుటచే పరిపూర్ణముగా నీగ్రంథమును ముద్రింపఁగల్గితిని.

మఱియు నేతద్గ్రంథముద్రణావసరమున, సంగంజాగర్లమూడి వాస్తవ్యులును, ఉభయవేదాంత ప్రవర్తకులును, గీర్తిశేషులు నగు శ్రీమాన్ నారాయణం వేంకటాచార్యులవారి జ్ఞాపకార్థము వారి పుత్రులు.ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్. శ్రీనివాసాచార్యులుగారును, ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ సత్యనారాయణాచార్యులుగారును రు. 300-0-0రూప్యములు, పోరంకివాస్తవ్యులైన ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ వేదాంతం రాజగోపాలాచార్యులువారు రు50-0-0 (ఏబదిరూప్యములు) ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ ఘనపాఠి, వేదాంతం శ్రీనివాసాచార్యులవారు రు50-0-0 (ఏబదిరూప్యములున్ను) విరాళముల నొసంగి ఈకార్యమునం దొడ్పడి కొంత భారమును దీసివేయుటచే మహోపకారులగు వీరియెడల నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఏతద్గ్రంథపరిష్కర్తలైన ఉ॥ వే॥ ప్ర శ్రీమాన్ విద్వత్కవి సార్వభౌమ, వైయాకరణపంచానన, రొం॥ భ॥ పార్థసారథికృష్ణమాచార్యులవారికిని, ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ పండిత ఉ॥ చ॥ శ్రీనివాస భట్టాచార్యులవారికిని, శ్రీవైఖానసభగవచ్ఛాస్త్ర గ్రంథమాలోద్ధార

కులై, గ్రంథసంపాదన పరిష్కారలేఖనాదికార్యములం దనవరతముఁ గృపిసల్పుచు నాకు మిక్కిలి యుత్సాహకారకులగుచున్న ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ (ఈపూరు) దేవయజనం వేంకటరామాచార్యులవారికిని, ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ (ఉల్లిపాలెం) నారాయణంరామానుజాచార్యుల వారికిని, గ్రంథమాలాపోషక సహాయకాది మహాశయులకును కృతజ్ఞతాపూర్వక ప్రణామశతంబుల నర్పించుచున్నాఁడను.

ఇం దెవ్వియేని లోపములు గన్పట్టినచోఁ బాఠకులు గుర్తించి మాకుఁ దెలియఁజేసిన యెడల శిరసావహించి పునర్ముద్రణమున సరి చేయించగలను.

ఇట్లు,
సుధీజనవిధేయుడు
భిషగ్రాజ దీవి వేంకటనృసింహాచార్యులు

శ్రీ వై॥ ఖ॥ గ్రంథమాలా
కార్యస్థానము నల్లూరు
సర్వధారి సం॥ శ్రీరామనవమి

ఓం నమశ్శ్రియై.

# నివేదిక

ప్రకృత ప్రస్తావన కనుబంధించిన మూలగ్రంథము పారమాత్మిక మను ప్రశస్తనామమును దాల్చిన ప్రముఖవైష్ణవోపనిషత్తు. ఇయ్యది పరమాత్మయగు శ్రియఃపతిస్వరూపగుణలీలావిభూతి నతిచారుతరముగ నభివర్ణించియుండినకతనఁ గాఁబోలు నిద్దానికిఁ బారమాత్మికోపనిషత్తను వ్యవహారము సార్థకతతో సిద్ధమయినది.

ఇది శ్రీవైఖానసశాఖీయులలో నెంతయో విరివిగఁ బ్రచారమార్జించినదై యున్నది. ఇతరత్ర తమటుకు వ్యాప్తియున్నటులఁ గానుపించదు. స్వాయంభువమై, యఖండమై, యపౌరుషేయమై తనరిన వేదరాశి శాఖాత్వేన వైఖానసి యనియును, వేదత్వేన యజుస్సనియును,

ఉభయత్వేన ఏకాయని యనియును, సీతోపనిషత్తు శ్రీవిష్ణుబ్రహ్మవైవర్త స్కాందపురాణములును, శ్రీవైఖానసభగవచ్ఛాస్త్రము మున్నగు నవి విపులముగ నుద్ఘోషించి యుండుటయు కాక వేదవిభాగమునకు మున్నే శ్రీవిఖనోమునిచరణులు తనచేఁ బ్రణయనము చేయఁబడిన శ్రీవైఖానసకల్పసూత్రమున నఖిలవేదమంత్రములును, సాంగక్రియా కలాపమున కనుగుణముగాఁ జెప్పించి సకలజీవరేఖాబంధవిముక్తికిఁ బరమసాధనభూతమగు శ్రీమన్నారాయణుని దివ్యోపాసనావిధానమును సైతము విశ్వకల్యాణచికీర్షతో ననుగ్రహించియున్నట్లు స్పష్టమవ గతమనుట నిరతిశయోక్తి. దీనిఁబట్టి వేదయుగమునందే వైఖానస మనునది యొకవిశిష్టధర్మసముల్లసితమగు మతముగా రాణించి నిజకీర్తి కల్పలతాంతసురభినిఁ గకుబంతముల గుబురుకొనఁ జేయుటచేతనే యష్టాదశమునిపరిషత్కాలమునాఁటి కగ్రగణ్యస్థానము వహించినది. కనుకనే శ్రీవైఖానసమంత్రప్రశ్నము లెన్మిదింటిలో నీపారమాత్మికము సప్తమప్రశ్నగాఁ బరిగణింపఁబడి యాథప్రచారముఁ గల్గియుండుట యభిజ్ఞతల్లజులకుఁ దెలియని యంశము కాదు.

అందుచే భగవద్విఖనోమునీంద్రుల కత్యంతప్రియాంతేవాసులును, మానసపుత్రులు నగు శ్రీభృగు మరీచ్యత్రి కశ్యపాచార్యులు నిజదేశికానుశాసన విధేయతఁ బరమాదృతి నధ్యయనించి లోకానుజిఘృక్షతోఁ దాము రచించిన 1, అధికార 2. సంహితా 3, తంత్ర 4. కాండములను పారిభాషికపద విలసితములగు శ్రీశాస్త్రగ్రంథముల నుద్ధరించి యుండుటచే నీయుపనిషత్తునకుఁ గల సముత్కృష్టత యనంతమయినది. అంతియగాక నాఁటినుండి నేఁటివఱకు నవిచ్ఛిన్న వైఖరిని, బరంపరయా శిష్యశిక్షణమునఁ బెంపొంది చెక్కుఁజెదరని రూపుతో సుమనోలోకములఁ దాండవించుచు, విబుధజనతామోదజనకస్థానమ్ము యలరొందుచున్నది. దీనికిఁ బరతత్త్వ మిదమిత్థమని నిష్కర్షించిన శ్రీభృగ్వాదిమహర్షిపుంగవులే ప్రవర్తకాచార్యులై యున్నారు.

ఇట్టి పారమాత్మికము పదునొకండనువాకములుగల్గినదై పంచోత్తరశతమంత్రములచే విలసిల్లుచున్నదనుట కాధారము. భగవన్మరీచి విమానార్చనకల్పము, ముప్పదిరెండవ పటలమున "అథాతః పారమాత్మికానుక్రమణ"౦అనునది మొదలు"విష్ణుస్సర్వేషామిత్యాదిపంచోత్తరశతం పారమాత్మిక మితి విజ్ఞాయతే" యను శ్రీసూక్తిని గటాక్షించుటయే. మఱియు దీనిలో నొక్కొక్క యనువాకమునకుఁ బదేసి మంత్రముల చొప్పునఁ బది యనువాకములును, మిగత మంత్రములైదు నేకాదశానువాకమునను గోచరించుచున్నవి. ఈ యుపనిషత్తు మొదలు పదియనువాకములందును సర్వతోముఖముగ మీమాంసించిన భగవద్విషయము లెవ్వి కలవో అవియే దశోపనిషత్తులందు విస్తృతములు. ఏకాదశానువాకమునందలి యైదు మంత్రములు మాత్ర ముక్తార్థమునకగు సంగ్రహమని చెప్పవచ్చును. ఇదియే శ్రీ వైఖానసజాతికి గుప్తనిక్షేపసన్నిభమునై ధారకము పరమవైష్ణవ ప్రపత్తిని బ్రసాదించి తారకమునై ప్రాముఖ్యస్థితిఁ బొలుపొందినది. కనుక నియ్యది సర్వోపనిషత్సారస్వతాంబరమున ముద్దులొలుకు చందమామయై యోపనిషదమహాపురుషుని యఱుత రాణించు మేలిమేలిమి పూలసరమై నెగడుట మనీషివతంసుల కతులానందభాగ్యదాయి యనుటలో నాక్షేపమే మున్నది?

ఇద్దానికి భాష్యకర్తలు శ్రీ శ్రీనివాసమఖి వేదాంతదేశిక భగవత్పాదులు. వీరికిఁ బూర్వము శ్రీనరహరిభట్టసూనులగు భట్టభాస్కరులు వ్యాఖ్యానించినటుల శ్రీ శ్రీనివాసమఖి వేదాంతదేశికులవారే తమ లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యమునందలి జిజ్ఞాసాధికరణములో ౩౧ పుటయందు 'యద్యపి శ్రీవైఖానసానాం విష్ణుబలికర్మణా ప్రపత్తిస్సిధ్యతి. తథాఽపి బ్రహ్మజ్ఞానేన విమలీకృతాత్మనః .యోవా భూతే రిత్యాదిమంత్రార్థానుసంధానపూర్వకం పునరపి ప్రపన్నాతిశాయిత్వసిద్ధయే ప్రపత్తిః కార్యైవ. పునస్తప్తచక్రాంకనస్యైవ నిషేధాభావాత్ శ్రీ భట్టభాస్కరాదిభిః శ్రీవైఖానసాభి

జన్మైః ప్రపత్తివిధానస్య దర్శితత్వాచ్చ' యనువాక్యసంసారమున శ్రీ వైఖానసులకు విష్ణుబలియను సంస్కారవిశేషముచేఁ బ్రపత్తి సిద్ధించినను, బ్రహ్మజ్ఞానముచే విమలీకృతాత్మగలవానికి 'యోవాభూతేః' అను మంత్రార్థము ననుసంధానముఁ జేయుట పూర్వముగా నింకను బ్రపన్నత్వ మతిశయించి సిద్ధించుకొఱకుఁ బ్రపత్తి చేయఁదగినదే. మఱల తప్తచక్రాంకనముమూదిరి వారలకు నిషిద్ధమైనది కాదు. అని నకారాణించు సందర్భమున శ్రీ పారమాత్మికము పదునొకండవయగు వాకములోని మొదటిమంత్రమైన యోవాభూతేః అను మంత్రము నుద్ఘాటించి దానికి భట్టభాస్కరుఁడు మొదలు శ్రీవైఖానసాభిజనులచేఁ బ్రపత్తివిధానము నిదర్శించియుండుటవలన నని పేర్కొని యుండుటనుబట్టియే శ్రీభట్టభాస్కరులకు శ్రీనివాసదీక్షితేంద్రులు పదు లనుట ధ్రువపడుచున్నది. కాని యింతకుఁ బూర్వపువాఁ డయ్యు నను నాతని గ్రంథమునకు వ్యాఖ్యాన మను ప్రసక్తియే కాని భాష్యము ను వ్యవహార మొక్క శ్రీనివాసదీక్షితేంద్రకృతికే గౌరవమును గూర్చుచున్నది.

ఈ యుపనిషద్భాష్యము శ్రీలక్ష్మీవిశిష్టాద్వైతభాష్యకరణానంతర ముపగీత మని చెప్పుటకు శ్రీవారి లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యమునందలి భట్టభాస్కరు నుద్దేశించిన ప్రసక్తియే ప్రబలనిదర్శనము. ఇవి కాక యిమ్మహనీయుని రచనలు పెక్కు గలవు. వీనిలోఁ జాలభాగము స్వమతతత్త్వసిద్ధాంతమును నిరాఘాటముగాఁ జాటునవియే యై యున్నవి. అట్టివారి యప్రతిమానప్రజ్ఞాప్రతిభాప్రాభవముల కుసిక పట్టయిన గ్రంథరాజము లన్నియు నేఁడు లభ్యమగుటలేదు. దాని కైఖనవారు సరిగా భద్రపఱచని కారణమునఁ గరాళకాలగర్భమున నొక కొన్ని జీర్ణించి యుండనోవు.

ఇట్టి లోకోత్తరపురుషుని జీవితసమయము నుద్దేశించి మహాకవి శ్రీ సుందరరాజసూరి శ్రీనివాసదీక్షితేంద్రచరిత్రములో "త్రింశ

దుత్తర చతుస్సహస్రేషు వ్యతీతేషు కలివర్షేషు సర్వజిద్వత్సరే. తుంగస్థే సవితరి తథా చంద్రేచ, వైశాఖే ప్రాజాపత్యే నక్షత్రే శ్లాఘనీయే లగ్నే...యః ఖలు నామ్నా శ్రీయాచ శ్రీనివాస ఇతి వవృధే. స వృధేతరజన్మా సన్మాన సకములాక్మమా"యని వ్రాసియుండుటవలనఁ గలియుగమున నాలుగువేల ముప్పదేండ్లు గడచినపిమ్మట నానాఁటికి సరియగు సర్వజిన్నామసంవత్సర వైశాఖశుక్లపంచమిని శుభగ్రహసన్నివేశముగల యొకదివ్యలగ్నమున నస్వర్థాభిధానముగల శ్రీశ్రీనివాసదీక్షితేంద్రుఁ డభ్యుదయ మందినట్లు ఋజువగుచున్నది. అందుచే యీ ప్రస్తుతకలివర్షములు 5048లో 4030 సంవత్సరములు మినహాయించు నెడల 1018 సంవత్సరములు మాత్రము మిగులఁగలవు. ఇందుమూలముగ నీతఁడు క్రీ.శ. 9, 10 శతాబ్దముల మధ్య నుండియుండుట స్పష్టము.

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి॥

అను శ్రీవామనపురాణసూక్తి నుద్దేశించియే కాఁబోలు నీమహావ్యక్తి ఋగ్వేదసిద్ధమైన శ్రీవేంకటాచలదివ్యక్షేత్రమే తనకుఁ బావనావాసముగఁ జేసికొని శ్రీవేంకటేశపాదాబ్జసపర్యానిరతహృదయుఁడై సర్వమాయనకర్పించి ప్రపంచమున నెల్లెడల భగవదర్చామహిమము నుజ్జ్వలింపఁజేసి పరమవైదికవైష్ణవసంప్రదాయధర్మములను బరిరక్షించియున్నాఁడు. ఇంతకన్న బ్రహ్మవిత్త్వము వేఱుండియుండునా? ఇట్టి ధన్యజీవిని గుఱించి శ్రీవైఖానసమహాజనము శ్రీనివాసాపరావతారమని సర్వథా సర్వదా శ్లాఘించుచుండుట కెదికాదు.

ఏమయినను నొక మహనీయపురుషుని పావనజీవనగాథాశ్రేణినిఁ బరామర్శించు తరుణమున నేవియో కొన్ని యపోహలు బయలుదేరుచుండుట లోకసామాన్యమైనది. అదేవిధముగ నీ శ్రీనివాసదీక్షితస్వామి శ్రీలక్ష్మీవిశిష్టాద్వైతభాష్యరచనాసందర్భమునను

కూడ బ్రహ్మసూత్రవార్తికోద్గ్రాహిణి రచయితలగు శ్రీమదనంత నారాయణాచార్యులవారు కారికాశ్లోకవార్తికమును బ్రహ్మసూత్రములపై వ్రాసినట్లును, దానినిఁ బురస్కరించికొని శ్రీనివాసదీక్షితేంద్రులవారు కొద్దిపాటి వివరణముతోఁ గొంత పూరించి భాష్యమును రచించినట్లుగా నిటీవల నధునాతనులగు కొందరు పండితప్రకాండులలో లేనిపోని సంచలనము కల్గినది. ఆవిధముగ నపోహ లేర్పడుట సుతరామసంగతము. ఏలన, బ్రహ్మసూత్రవార్తికోద్గ్రాహిణి గ్రంథారంభమునఁ గర్తయగు అనంతనారాయణాచార్యులవారు,

శ్రీనివాసగురుం నత్వా వేంకటేశ్వర మవ్యయమ్
అవిరోధం వదిష్యామి వేదాంతార్థప్రసిద్ధయే॥

శ్రీనివాసగురుం నత్వా చతురధ్యాయగోచరమ్
అర్థం సంక్షిప్య వక్ష్యామి సూత్రకారవివక్షితమ్॥

వైఖానసాన్వయజసుందరరాజసూను
ర్వేదాంతసార మతులం కృతవాన్ వృషాద్రౌ
యత్కర్మమణ్మతవిసారి కవీశ్వరాణాం
సంసేవితం మరమునీశ్వరలాలితం చ॥

శ్రీవేంకటేశచరణార్పితచిత్తవృత్తిమ్
వైఖానసాగ్ర్య మమలాత్మగుణై రుపేతమ్
శ్రీశ్రీనివాసమఖినం నిగమాంతవిద్యా
చార్యం భజే మమ గురుం సకలాగమజ్ఞమ్॥

అని స్వయముగఁ జెప్పికొనుట కతన నీతని శిష్టదైవతము వేంకటాచలపతి యనియు, తండ్రి శ్రీసుందరరాజాచార్యుఁ డనియు, నునికిపట్టు శ్రీవేంకటాచలమే యనియు, గురువరేణ్యులు సకలాగమజ్ఞచక్రవర్తియు, శ్రీవేంకటేశచరణారవిందసమర్పితచిత్తవృత్తిగల శ్రీనివాసనిగమాంతాచార్యు లనియు, సూత్రకారవివక్షితమై, చతురధ్యా

యగోచరమైన వేదాంతసారము నవిరోధముగా సర్వమును సంక్షేపించి చెప్పఁగల్గుచున్నానని, స్వేష్టదైవతగురువర్యుల కెఱిఁగి వేదాంతార్థప్రసిద్ధికొఱకీయుద్యమము నారంభించుచున్నాఁడనని నొక్కి వక్కాణించుటలోనే పైయుపోహ కేమాత్ర మెడమీయక మీఁదు మిక్కిల శ్రీమదనంతనారాయణాచార్యులు శ్రీశ్రీనివాసమఖిసత్తమునకుఁ బ్రియాంతేవాసియనికూడ బలవత్తరసాక్ష్య మీదుచుండుటచే నా యుపోహ యపాస్తము. ఈశ్లోకములలోఁ బేర్కొనఁబడిన శ్రీమదనంత నారాయణాచార్యుల తండ్రియగు శ్రీసుందరరాజాచార్యులు శ్రీవైఖానస సూత్రవృత్తికారులో, తదన్యులో సందు వివరించియుండలేదు. ...మఱియు మహాకవి కాళిదాసుని యభిజ్ఞానశాకుంతల నాటక వ్యాఖ్యాతలగు శ్రీనివాసాచార్యులవారే, శ్రీలక్ష్మీవిశిష్టాద్వైతభాష్య కర్తలనియును నొకవింతవాదమును రచయితల గ్రంథముల నాద్యంత మరయక యే కొందఱు వివదించుచున్నారు. ఇది మఱింత యజ్ఞాన విజృంభితము. దీనినిఁగూర్చిన యథార్థాంశము యా గ్రంథములే నిర్ణయించఁగలవు.

1. శ్రీ లక్ష్మీవిశిష్టాద్వైత భాష్యకర్త అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యాత కానేరడు. ఒండొరులు భిన్నులు. ఇందునుగూర్చి......
దశవిధ హేతు నిరూపణము మంగళాచరణములు

శ్రీమత్కౌశికవంశ్యేన గోవిందాచార్యసూనునా
శ్రీవేఙ్కటేశపాదాబ్జ సపర్యానిరతాత్మనా।
వేదాన్తాచార్యవర్యేణ శ్రీనివాసార్యయజ్వనా
శ్రుతిస్మృతిపురాణాదిసూత్రమార్గానుసారిణా
పూర్వాచార్యపరిక్షుణ్ణసంప్రదాయానుయాయినా॥

అనియును శ్రీలక్ష్మీవిశిష్టాద్వైతభాష్యము గ్రంథాంతిమగద్యములో

" ఇతి శ్రీవేఙ్కటేశ చరణారాధనప్రవణ తత్ప్రసాదాధిగత వేదాన్తదేశికాభిఖ్య కవికులతిలక సర్వతన్త్రస్వతంత్ర శ్రీనివాసా

ధ్యరీన్ద్రవిరచితే శ్రీవిశిష్టాద్వైత శారీరకబ్రహ్మసూత్ర మీమాంసా భాష్యే.....అనియును

శ్రీ శ్రీనివాసదీక్షితులవారి గ్రంథములం దాద్యంత పద్య గద్యములు చూపట్టుటచే వీరు కౌశికగోత్రులు, గోవిందాచార్యుని పుత్రులు, శ్రీ వేంకటేశపాదాబ్జసపర్యానిరతహృదయులు, శ్రీనివాస దివ్యాజ్ఞాలబ్ధ వేదాంతదేశికులు, కవికులతిలకులు, సర్వతంత్రస్వతంత్రులు ఈ మొదలుగాగల యుపాధులచే విరాజిల్లినటుల విస్పష్టమగు చున్నది. ఇంతియగాక మహాకవి శ్రీ సుందరరాజసూరియును, శ్రీనివాసదీక్షితేంద్ర చరితమున......"సహి మహితమనీషః ప్రథితేస్మ పృథివ్యాం సర్వతంత్రస్వతంత్ర ఇతి.

తతః శ్లో॥ వేదాన్తవేద్యః పురుషః పురస్తాత్
ప్రాదుర్భవన్ భవ్యగుణం తమాచే
వేదాన్తశాస్త్రార్ణవపారదృశ్వన్
హేదాంత వేదాంతగురుస్స్వ మాసీః॥ ఇతి.

శ్రీ వేఙ్కటేశదివ్యాజ్ఞాలబ్ధ వేదాన్తదేశికాభిఖ్యస్సుధీముఖ్యస్సప్తభిః పాకయజ్ఞై ర్హవిర్యజ్ఞైస్సోమయజ్ఞైశ్చ "యజ్ఞో వై విష్ణు" రితిశ్రుతిచోదితయజ్ఞపురుషభావం నారాయణ మారాధయామాస. తతః శ్రీనివాసదీక్షిత వేదాన్తదేశిక ఇతి దిశిదిశి ప్రతీతోఽభవత్" అని యివ్విధముగ నభివర్ణించియుండుటచే నైవిషయమున కెక్కుడు ప్రాబల్య మొనగూడు టెంతయు సముచితకార్య మగునుగదా!

(2) శ్రీమదభిజ్ఞానశాకున్తలవ్యాఖ్యాత శ్రీనివ్యాసాచార్యులు
శాకున్తలవ్యాఖ్యానారంభము-మంగళాచరణము.
"లక్ష్మీస్తం వ స్సతతాం తనోతు ... అనుటతో మొదలిడి

వైఖానసాన్వయపయోధిమృగాఙ్కమూర్తిః
శ్రీకౌశికో విజయతే సహి తిమ్మయాఖ్యః॥

తస్య పుత్రో౽స్తి విద్యానాం స్వయంవరపతిః కవిః
వ్యాఖ్యాతా నాటకాదీనాం శ్రీనివాస ఇతి శ్రుతః॥
యం శ్రీనివాస మఖిలాగమసారసింధు
కుంభోద్భవం బుధజనాః పరికీర్తయంతి"॥

అనియును గ్రంథాంతిమగద్యమున శ్రీరమణవేంకటాచలేశ్వరపాదారవిందసమారాధక శ్రీవైఖానసకులతిలక, శ్రీకౌశికగోత్ర, వేఙ్కటభట్ట ఇతి గోత్రక్రమాగతభట్టబిరుద శ్రీతిరుమలాచార్యపుత్రేణ ధ్వనిప్రస్థానపరమాచార్యేణ అష్టభాషాచక్రవర్తి శ్రీనివాసాచార్యేణ విరచితాయాం శాకుంతలవ్యాఖ్యాయాం॥ అనియు నుద్ఘాటించియుండుట వలన నీతఁడు కౌశికగోత్రమునకుఁ జెందినవాఁడు, తండ్రి తిరుమలాచార్యులు, వేంకటభట్ట యను గోత్రక్రమాగతభట్టబిరుదము గలవాఁడు, ధ్వనిప్రస్థానపరమాచార్యుఁడు, అష్టభాషాచక్రవర్తి, యనియు రూఢియగుచున్నది. ఇంతియుకాక నాందీశ్లోకవ్యాఖ్యానసందర్భముననే నాందీప్రస్థాపనావైవిధ్యమును ప్రసక్తించుతఱిని (వావిళ్ళవారిప్రతి) 9-వ పేజిలో వేణీసంహారే మదీయే నైషధానందే చాష్టాదశపదా అనియును,

11-వ పేజిలో ఏతేషాం లక్షణం మదీయమాళవికాగ్నిమిత్రీయవ్యాఖ్యానే ద్రష్టవ్యమ్" అని యభినయభేదవైలక్షణ్యములను వివరించుతరుణమునను

19-వ పేజిలో "ప్రకృతే కాళిదాస ఇతి" నిరుపపదప్రయోగేణ గుప్తాహంకారఫణిత్యాదా త్తత్వం సూచ్యతే పరాపవాదా త్స్వోత్కర్షవాదీ తూద్ధత ఇత్యుచ్యతే, యథావా మదీయే నైషధానందే బాఢం సంతి మహీతలే సుకవయ స్తత్రాప్యసౌ గణ్యతే, ముఖ్యో వేంకటనాధపూజనపర శ్రీశ్రీనివాసః కవిః..."అని సహజముగా మహాకవుల కుండఁదగిన సమయోచితప్రతిభాసముద్ధతిని ప్రదర్శించుట త్యావశ్యక మనునది నిర్ధారించుపక్షమునను, అదే పుటలో నింకొ

కచో "ఛథా మదీయే నైషధానందే వక్రోక్త్యలంకారరసాతిశాయి వ్యంగ్యోక్తిశ్రీకం ... అని" సోద్దీపకతను గూర్చియు

78-వ పేజీలో ధాథావా మదీయే నైషధానందే.

" అద్య స్వప్నే ప్రియసఖి మయాదర్శి కాచి త్త్రిలోకీ
భూషాయోషా ఫణితిమనసో రప్యలభ్యానుభావా
స్మారంస్మారం తరళనయనాం తాం తప త్యంతరాత్మా
వారంవారం విసృజతి శరాన్ పాతకీ పంచబాణః" అని యను

రాగమునకు స్వప్నదర్శనము బీజమను విషయమునను

165-వ పేజీలో 'శేత్రయోహస్తాః మదీయేమాళవికాగ్నిమిత్రీయ వ్యాఖ్యానే ద్రష్టవ్యాః' అని యభినయాంగమగు హస్తత్రయ విన్యాసము ను నిదర్శించునపుడును,

295-వ పేజీలో (స.అం)మదీయేనైషధానందే ఫణితమ్. అని చతుశ్చత్వారింశదుత్తరశతనాయకభేదము లనుప్రస్తావించు సమయమునను, స్వకీయములగు రచనలను దత్తత్సందర్భముల కనుగుణరీతి నుదాహరించి యుండుటవలన వీరు శ్రీమదభిజ్ఞానశాకుంతలవ్యాఖ్యతోఁబాటు మాళవికాగ్నిమిత్ర నాటకమునకును వ్యాఖ్యానించినట్లును, నైషధానందమను నొక మహానాటకమును విరచించినట్లును విస్పష్టమగుచున్నది. మఱియు విక్రమోర్వశీయవ్యాఖ్యానమును, రసికానందప్రహసనమునుగూడ వ్రాసి యమరభారతీవాఙ్మయపీఠమునకుఁ బూజాప్రసూనమాలగాఁ సమర్పించినటులఁ గొందఱు మనీషివతంసులు చెప్పుచున్నారు. కాని యేలనో! శాకుంతలవ్యాఖ్య యొక్కటితప్ప తక్కినవి యేవియు నీనాఁడు మన దృక్పథమునకు గోచరింపకుండుట చింత్యము. వీరి రచనము లన్నియు రసవత్సాహిత్యబంధురతను బ్రకటింపఁగలవై యున్న వేకాని తదన్యము లు మాత్రము కానేరవు. వీరి జీవితకాలమును నిర్ణయించుటకు దగినన్ని యాధారములు చారిత్రకదృష్ట్యా కన్పడక పోయినను శాకుంతలవ్యాఖ్యలలోని రాఘవభట్టీయవ్యాఖ్యకుఁ దరు

వ్రాసినది యెవ్వడనని విద్వాంసులు కొంతమంది తలంచుచుండుటచే నీతఁడు క్రీ. శ. 17 వ శతాబ్దమున నుండెనని యూహించవలసివచ్చు చున్నది. ఇది యిట్లుండ శ్రీవైఖానసకులహిమమంజరీభూమణులగు శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్యులుగారు "అత్ర కేచి దుత్తమ బ్రహ్మవిద్యా శాకుంతలవ్యాఖ్యాది ప్రణేతా స్వయమేవ శ్రీనివాసాఖ్య ఇతి బ్రువతే" అని వ్రాయుటచే శాకుంతలవ్యాఖ్యాతలగు శ్రీనివాసాచార్యులవారే యుత్తమబ్రహ్మవిద్యయను గ్రంథమును సైతము వ్రాసియున్నారని యభిప్రాయపడిరి. కాని శ్రీవారి గ్రంథముల యందు స్వమతతత్త్వనిర్ణాయకమైన గ్రంథ మొక్కటికూడ నున్నటులఁ గానము. ఈయుత్తమబ్రహ్మవిద్యాగ్రంథము నుద్దేశించి మహాకవి శ్రీ సుందరరాజసూరి తన యుత్తమబ్రహ్మవిద్యాసారమను గ్రంథములోని యుపోద్ఘాతమునందు 'ఇహఖలు శ్రీవైఖానసకులమణిదీప స్సర్వతంత్ర స్వతంత్రః శ్రీవేంకటేశపాదారవిందసపర్యానిరతహృదయః శ్రీమచ్ఛ్రీనివాసాధ్వరీ వేదాంతదేశిక శ్శారీరక మీమాంసాభాష్యే భగవదారాధన మేవ శ్రేయాన్ ముక్త్యుపాయ ఇతి నాతివిస్తరం నిర్ధార్య తదేవ ప్రపంచయితుకామ ఉత్తమబ్రహ్మవిద్యాఖ్యం గ్రంథ మచీకలత్. సతు లేఖకప్రమాదా దవిశుద్ధరూప స్సమభూత్ తద్వి శోధనాయ బహూనాం కోశానా మనుపలంభా ల్లబ్ధకోశదృష్టాని శ్రుతి స్మృత్యాదిప్రమాణాని స్వదృష్టాని చ మేళయిత్వా తదభిప్రాయాను సరణేన సజ్జనప్రీతయే ఉత్తమబ్రహ్మవిద్యాసారో నామ గ్రంథః ప్రణీయతే ఇతి' అని యారీతిగ వచించియుండుటవలన శ్రీవైఖానసకులమణి దీపము, సర్వతంత్రస్వతంత్రులు, శ్రీవేంకటేశపాదారవిందసపర్యా నిరతహృదయు లగు శ్రీమచ్ఛ్రీనివాసాధ్వరీ వేదాంతదేశికులువారు తన శారీరకమీమాంసాభాష్యమున భగవదారాధనమే శ్రేయస్సును, ముక్త్యుపాయము నగు నని యతివిస్తరముగాకుండ నిర్ధారించి యదియే విస్తరింప నెంచినవాడై యుత్తమబ్రహ్మవిద్యయను గ్రంథమును రచించె ననియు, నయ్యది లేఖకుల ప్రమాదములవలన నవిశుద్ధరూప

మందినదై యద్దానినిఁ బరిశోధించునిమిత్త మెన్నియో (శ్రీ)కోశము
లవసరమై యవి యలభ్యము లగుటవలన దొరకిన కోశములం దుప
లబ్ధమైనట్టి శ్రుతిస్మృత్యాదిప్రమాణములను స్వయముగఁ జూచి
వాని నన్నింటిని మేళవించి, తదభిప్రాయానుసారముగ నీయుత్తమ
బ్రహ్మవిద్యాసార మనుదానిని సజ్జనసంతుష్టికై రచించియుంటి నని
స్పష్టపఱచియుండుటనుబట్టియే యీగ్రంథమును వ్రాసినవా రెవ
రయినది నిస్సంకోచముగ నిర్వివాదముగఁ జదువరుల కెఱుకపడక
మానదు. అట్టిస్థితిలో (శ్రీ)సుహిమమంజరీభూమికాకర్తలు నిరాలోచ
నముగ వ్రాయుటఁ జూడ సుమనోల్లాసనమునకుమారు సహృదయా
వేదన మగుచున్నది. ఇంకను నాభూమికలోనే కొన్నిచోట్ల 'అథా
ప్యస్యా మగ్రే మంగళశ్లోకాద్యభావాత్. గ్రంథప్రవృత్తిబీజానుల్లే
ఖాత్' అనియు నేవేవో యనవసరములగు వ్రాతలు తానుపోద్ఘాతముం
జేయ నెంచిన మూలగ్రంథ మాద్యంతములు పరిశీలింపకయే వ్రాయుట
దుస్సాహసము కాదా? ఇంతకన్న ఘోరాపచార మింకేముం
డును! సర్వజ్ఞశిరోమణుల సరసరుచిరాభిమత ప్రవృత్తిశోభాసంతతి
నరికట్టువాఁ డెవ్వఁ డీవిశ్వజగతిని... ఈయుపనిషద్భాష్యమున కనంత
రము ప్రసంగవశముగా వ్రాయఁబడినది (శ్రీ)వైఖానసమహిమమంజరి
యనఁబడు గ్రంథరాజమైయున్న దనుటకు (శ్రీ)దీక్షితులవారే యద్దాని
యుపక్రమణికలో వ్రాసిన 'శ్రీవైఖానససద్విపులసన్మహిమమంజరీ పార
మార్థికభాష్యాంతే ప్రసంగా ద్రచ్యతేఽధునా' అనెడు శ్లోకముచే
వెల్లడియగుచున్నది. ఇది పూర్వోత్తరభాగములు రెండుగా రచింపఁ
బడియున్నను బ్రకృతమున కొక పూర్వభాగముమాత్రమే లభ్య
మగుట చింతనీయము. ఈ గ్రంథమునకుఁ జంద్రికావ్యాఖ్యానమును
సాయించిన మహాకవి శ్రీ సుందరరాజసూరి పూర్వభాగవ్యాఖ్యాం
తమున నేతద్గ్రంథావతరణమునకుఁ గల కారణమును సువ్యక్తముఁ
జేయుచు "యదీతఃపర మపి కేచన ప్రవర్తేరన్ శ్రీవైఖానసమానసే
గ్రంథస్యాస్యోత్తరభాగే ప్రపంచితం" అని యుల్లేఖించిన స్థితి ననుస

రించి వారికాలమునాఁటికీగ్రంథము సమగ్రముగఁ బ్రచారము గల్గియున్న దనుట నిస్సంశయము. బ్రహ్మసూత్రములకు వీరు శ్రీభాష్యమును వ్రాయుటకుముందే శ్రీ కేశవాచార్యులను నొకరు బ్రహ్మసూత్ర వార్తికవృత్తిని వ్రాసియుండినటుల శ్రీలక్ష్మీవిశిష్టాద్వైత భాష్యములో నుత్పత్త్యసంభవాధికరణమున (199 పు) "విప్రతిషేధాచ్చ" అను సూత్రమునకు భాష్యమును విశదీకరించు నపుడు "ఏవ మస్మాభి రిహ పాంచరాత్రస్య శ్రీమన్నారాయణారాధన ప్రతిపాదనపరతయా తత్ప్రతిషేధం సర్వథానంగీకుర్వాణైః స్వదనుసారేణ సూత్రచతుష్టయం వివృతమ్. అస్మత్కులాభిజన శ్రీకేశవాచార్యవిరచితాయాం బ్రహ్మసూత్రవార్తికవృత్తౌ చతుర్భిస్సూత్రైః పాంచరాత్రమతనిరాకరణార్థ మధికరణ మిద మిత్యుక్తమ్" అను భాష్యపంక్తులవలనఁ దెలియుచున్నది. ఈ కేశవాచార్యులవారినిగుఱించి శ్రీ వైఖానసగురుపరంపరానుసంధానక్రమములోఁ గూడ,

> శేషాచలాధీశగురుం తచ్ఛిష్యం శ్రీపతిప్రియమ్
> తచ్ఛిష్యం కేశవాచార్యం మీమాంసావృత్తి దేశికమ్ ॥

అని చెప్పఁబడినందున బ్రహ్మమీమాంసావార్తికాచార్యులను వ్యవహారము వీరి కున్నట్లు విదితము. అంతియగాక వీ రర్చనానవనీతమును గూడ వ్రాసియున్నారు ఇయ్యది శ్రీనృసింహవాజపేయయాజులచేఁ బ్రణీతమగు నధ్యాయసప్తకములోఁ గూడిన భగవదారాధనక్రమమునకుఁ బంచఖండాత్మక మగు వ్యాఖ్యానమైయున్నట్లు స్పష్టపడఁగలదు. గమనింపుడు. అర్చనానవనీతము మంగళాచరణమున,

> శ్రీవైఖానససద్గ్రాబ్ధే మథితం మతిమంధరాత్
> అర్చనానవనీతాఖ్యం కేశవేనామృతం యథా
> శ్రీవైఖానసభృగ్వత్రికాశ్యపాంగిరసాం మతే
> నృసింహవాజపేయ్యుక్తసప్తాధ్యాయే సమంత్రకే।
> పంచఖండాత్మికే వ్యాఖ్యా యథాభాగ్యం ప్రకాశ్యతే

అని యుల్లేఖింపఁబడిన శ్లోకములే పైనఁ బేర్కొనఁబడినయంశములకు నిదర్శనములు. ఈ యర్చనానవనీతకర్త శ్రీకేశవాచార్యుల వారిచే స్మరింపఁబడిన శ్రీనృసింహవాజపేయయాజులవారే శ్రీవైఖానససూత్రమునకుఁ దొలిగా వ్యాఖ్యాన మొనర్చినవారు; జగత్ప్రసిద్ధ పండితులు. శ్రీసూత్రదర్పణము, సర్వప్రతిష్ఠావిధిదర్పణము మున్నగు బహుగ్రంథరత్నములను శ్రీవైఖానససత్సంప్రదాయరక్షణము నకై కృపజేసిన మహనీయమూర్తి. వీరి కనంతరమే శ్రీవైఖానస సూత్రమునకు శ్రౌతభాష్యమును శ్రీనివాసదీక్షితీయ మను పేరితోఁ బ్రస్తుతప్రసక్తికిఁ గారణభూతులగు శ్రీశ్రీనివాసదీక్షిత వేదాంతదేశిక గురువరేణ్యులే రచించియున్నారు. వీరు శ్రీపారమాత్మికోపనిషత్ భాష్యమును రచించుటకు ముందు శ్రీభట్టభాస్కరుని వ్యాఖ్యానము పారమాత్మికవిషయమునఁ దన కెట్లు మార్గదర్శక మయ్యెనో యటులే శ్రీలక్ష్మీవిశిష్టాద్వైతభాష్యరచనకు శ్రీకేశవాచార్యులవారి బ్రహ్మమీమాంసావార్తికవృత్తి యుపకరించియుండె ననుట నిక్కువము. ఏమయినను నేఁడీ కేశవాచార్యుని వార్తికగ్రంథ మొక టున్నదను మాటమాత్రమే కాని చక్షుస్సాఫల్యస్థితినిఁ గూర్చియుండలేదు. ఇదే విధముగ నెన్నియో లెక్కలేనన్ని మతగ్రంథములు విస్మృతిప్రవాహమున లీనమైపోయినందులకు విచారింపవలసివచ్చుచున్నది.

1. మాధవాచార్యులు త్రిశతికర్తలు వాజపేయయాజులవారితండ్రి

2. శ్రీనృసింహవాజపేయులవారు శ్రీవైఖానససూత్రభాష్యకర్తలు బహుగ్రంథప్రణేతలు.

3. శ్రీభట్టభాస్కరులు శ్రీపారమాత్మికమంత్రవ్యాఖ్యాత (వేదభాష్య కర్తయు నితఁడేమో.)

4. శ్రీకేశవాచార్యులు శ్రీవ్యాససూత్రములకు వార్తికవృత్తిరచించినవారు.

## 5. శ్రీసుందరరాజస్వామి శ్రీవైఖానససూత్రవృత్తి వ్రాసినవారు.
(ఇదియే సుందరరాజీయ మని వాడుక.)

వీరు బ్రహ్మసూత్రవార్తికోద్గ్రాహిణికర్తలగు శ్రీమదనంతనారాయణాచార్యుని తండ్రియే యైయుండనోపును. వీ రందరును శ్రీశ్రీనివాసమఖి వేదాంతదేశికస్వామికిఁ బూర్వులనుటకు వీలయినన్ని యాధారము లుచితరీతిని బైనుదాహృతములు. ప్రకృతగ్రంధమునకు మూలాధారమయిన చారిత్రకపురుషుల జీవితసమయము సరాసరి యీ నాఁటికి క్రీ. శ. 9, 10 శతాబ్దముల మధ్యనై యుండునని వెనుకఁ జెప్పియుంటచే వీరికిఁ బూర్వులని యుద్ఘాటింపఁబడిన మహాపురుషులు దాదాపు రెండుశతాబ్దములయినను బైఁబడినవారై యుందురనియుఁ, నింతకన్నఁ బరమాధారములు లభ్యపడువఱకు నూహసేయుట యుక్తమగునని తలంచెదను. వీని కనుబంధించిన వివరము లింకను దెలియఁగోరు మాప్రియపాఠకమహాశయులు నాచే విరచితమగు శ్రీ వైఖానసమహాపురుషుల జీవితప్రశంసయందుఁ దిలకింతురని స్వరూపోచితవిధేయత నంజలింతును.

సడలిన పరమవైదికధర్మముల సంస్కరింపఁ, బాదరిన భగవదాస్తిక్యమనీషను బ్రతిష్ఠింపఁ, బరాక్రమించిన పాపాచారపరంపరఁ బంచబంగాళ మొనరింప విశ్వభారతగగనమున వెలసిన యొకదివ్యజ్యోతి యీ పరమపావనమూర్తియే. ఇతఁడే శ్రీవైఖానసమతోద్ధారకుఁడు. ఇమ్మహిమశాలియే శ్రీమన్నారాయణపారమ్యమును బ్రతిమానవహృదయఫలకముల సువర్ణాక్షరాంకిత మొనర్చినది. ఈదివ్యావతారమే లోకలోకముల శ్రియఃపత్యుపాసనారహస్యములను వెదఁజల్లిన దిట్ట. ఈ మహాభాగుఁడే పరమవైష్ణవధర్మశరీరమునకుఁ బవిత్రజీవాతువు. ఈసర్వజ్ఞశిరోమణియే సకలచేతనరక్షాదీక్షితుఁ డగు శ్రీ శ్రీనివాసదీక్షితుఁడు. ఇట్టి యనిర్వచనీయప్రజ్ఞాసంపన్నునిగుఱిం

చిత్యే మహర్షి కులమార్ధన్యుఁడు శ్రీ భృగుమునిపుంగవుఁడు ప్రకీర్ణాధికారము (37-వ అధ్యాయము) త్రియుగధర్మప్రపంచములో,

తదే వారాధనం విష్ణో రవజ్ఞాతం విశేషతః
ఖ్యాపనార్థం కలౌ కశ్చి ద్భవిష్యతి మహామతిః॥ 145

ధర్మగ్లాని రధర్మస్య వృద్ధి ర్యావ ద్భవిష్యతి
తావ ద్భర్తా మహావిష్ణుః సృజ త్యాత్మాన మాత్మనా॥ 146

శ్రీనివాసే జనావాసే శ్రీనివాసః స్వయం హరిః
శ్రీనివాససమాఖ్యాతో భూమా వవతరిష్యతి॥ 147

ఉత్పత్స్యమాన ఏవాసౌ భ్రాజమానః స్వతేజసా
జగదావరణం క్రూరం తమఃపుంజం హరిష్యతి॥ 148

పంచహాయన ఏవాథ ప్రాప్త స్సర్వకలాకులః
సంస్కృతోఽఖిలసంస్కారై ర్బ్రహ్మవర్చససేవితః॥ 149

విధినా శాస్త్రదృష్టేన దేవ మారాధయిష్యతి
ప్రసాదసుముఖో దేవః స్వాత్మభూతే శిశౌ స్వయమ్ 156

ఆనమయ్యచ మూర్ధానం గ్రహీష్యతి గళే స్రజమ్॥ 157

స్వయం సార్థం కుమారేణ హసింప్తి చ భుజిష్యతి॥ 159

అర్చావతారమాహాత్మ్యం లోకేభ్యః ఖ్యాపయిష్యతి॥ 160
విశాలే బహుసంస్కారసంకులే వసుధాతలే

స్థాపయిష్యతి విష్ణ్వర్చాం గ్రామే గ్రామే గృహే గృహే॥ 162

---

ఇ ట్లతిచారుతరముగ నభివర్ణించి యుండుటకంటె సహృదయులోక మున కాహ్లాదజనక మింకేమి కలదు? దీనికన్న మించిన పరమార్థసత్య ప్రమాణ మొక్క డుండునా? ఏతచ్చరిత్రాంశమునే స్థూణానిఖనన న్యాయముగా (శ్రీ)వారాహ పురాణాంతర్గత (శ్రీ)వేంకటాచల మాహాత్మ్యములోని (శ్రీ)వేంకటేశాష్టోత్తర శతనామావళీ కథనమునందలి 61–వ అధ్యాయము 40 శ్లోకమున,

సుధర్మిణీ సుచైతన్యప్రదాత్రే మధుఘాతినే
కృష్ణాఖ్య విప్రవేదాంత దేశికత్వప్రదాయ చ.

అని యీరీతిగఁ బ్రస్తుతించిన గాథ కృష్ణశర్మయను బ్రాహ్మణవతంసునికి నుత్తరజన్మమున వేదాంత దేశికత్వమును గటాక్షించియున్నట్లు (శ్రీ)వేంకటాచలరమణుని దివ్యానుశాసన ముద్ద్యోతిక మగుటను బట్టియే ప్రబలతరసాక్ష్యమునై విరాజిలుచున్నది. కనుక సర్వేశ్వరుఁడును, సత్యసంకల్పుఁడును, సర్వజ్ఞుఁడు నగు శ్రియఃపతి యేది చేయలేడు? అతనిలీలావాహినిలో నెదురీదువాఁ డెవఁడు? అయ్యది సాధ్యమగునా? ఎవనికైనను అతని మహిమ యపారము. అతివిచిత్రభూమి, సాక్షాత్తు (శ్రీ)నివాసభగవానుఁడే తనను గుర్తించుటకుగాఁ దన కగు పరమపవిత్రోపాసనారహస్యము ప్రజాప్రపంచమున కంతటికి సర్వసౌలభ్యముగాఁ బ్రబోధించుటకు (శ్రీ) (శ్రీ)నివాసదీక్షిత వేదాంతదేశికస్వామియై యవతరించె నన్న నట్టి మహామహు నెంత వర్ణించినఁ దనివి యేర్పడును? ఏతాదృశ విశ్వకల్యాణమూర్తి నేదో, యొకవిధముగా స్మృతించఁగల భాగ్య మబ్బినందులకు ధన్యోఽహం కృతకృత్యోఽహం॥ అని నేఁ డనుకోఁగల యోగ్యత యేర్పడినది మాదృశునకు——.

ఈ యుపనిషద్భాష్యమునకుఁ జంద్రిక యను వ్యాఖ్యానము వ్రాసినది ఆత్రేయగోత్రజుఁడగు మహాకవి ఇలత్తూర్ శ్రీ సుందరరాజసూరి. తండ్రి వరదరాజసూరి. తల్లి కృష్ణాంబ. శ్రీరామసందేశహార ప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య పట్టభద్రుడు. ఉనికిపట్టు దక్షిణ కేరళములందలి తిరువళ్లోలి మండలమునకు సంబంధించిన ఇలత్తూ రగ్రహారము. స్వాత్రే

యమూ అనంతశయన మహారాజాస్థానము. క్రీ. శ. 1880 వఱకును వీరు భారికయాత్ర గడపియున్నటుల వీరికుటుంబము వారివలనఁ దెలియుచున్నది. వీరికిఁగల శాస్త్రపాండితి యనన్యసాధారణమైనది. సంస్కృతసారస్వతమున ననేకవిధములగు ననేకగ్రంథములను రచించియుండిరి. ఇందులకగు నిదర్శనము పై వారిచేఁ బ్రణీతములయిన గ్రంథములే.

(1) రసికరంజనభాణము సూత్రధారప్రస్తావనలో

శ్లో॥ శ్రీరామభద్రవిజయాదికృతీ రనేకా
నిర్మాయ దత్తరసికః ప్రమదః కవీంద్రః
శృంగారిభిః కతిపయైః పున రర్థ్యమానో
భాణం వ్యధా త్స కిల సుందరరాజసూరిః.

(2) పద్మినీపరిణయనాటకము నాంది ప్రస్తావనలో

సూ॥ అస్తి కిల దక్షిణకేరళేషు స్యానంపూరపురమ్.

పూ॥ అహహ! తత్రభగవతః పద్మనాభాభిఖ్యస్య పరమాత్మనో భోగశయనభూమిః ఖలు.

సూ॥ మత్యా ధృత్యా శుభకవితయా విద్యయా దేవభక్త్యా
లక్ష్మ్యా చోచ్చై రుపచితతయా ప్రాప్య సామ్రాతురత్వమ్
శక్తిం బిభ్ర ద్విమతవిజయే ఖ్యాపయ న్నామ నైజమ్
రాజో త్తంసో జయతి ధరణౌ శ్రీవిశాఖో యశస్వీ॥
తదీయభుజ మాలంబ్య వర్తతే పాండ్యమండలే
ఇళత్తూరాఖ్యనగరీ కవిరత్నావళీఖనిః॥

పూ॥ విదితం త న్నగరం యత్ర ఖలు శ్రీవైఖానసకులతిలకాయమాన వరదరాజనందనః శ్రీకృష్ణాంబికాగర్భశుక్తిముక్తామణిః సుందరరాజకర్తా శ్రీరామసందేశహారప్రసాదలబ్ధప్రతిభాభాసురః ప్రకాశతేతరామ్.

సూ॥ సహి మహితం శ్రీరామభద్రవిజయాభిఖ్యం చంపూప్రబంధం వైదర్భీవాసుదేవ హనూమద్విజయాభిధ నాటకయుగళం చ నిర్మాయ పశ్చా దుత్పాద్యేతివృత్తం పద్మినీపరిణయాభిధానం ప్రకరణమ్' అనియును.

ఉత్తమబ్రహ్మవిద్యాసారము – గ్రంథాంతిమగద్యయందు

"శ్రీరామభద్రదాసస్య శ్రీవైఖానసాత్రేయకులతిలక శ్రీవరదరాజ సూరినందనస్య ......... సుందరరాజస్య కృతిషు" అనియును నిజచరిత్రానుబంధములగు సర్వవిషయములను బూసగ్రుచ్చినరీతిగా నుల్లేఖించియుండుటచే నుపర్యుదాహృతాంశములను సుదృఢ మొనర్చు చుండుట విదితము. అనర్గళధారాశుద్ధిగల్గినదై మృదుమధురపదవిన్యాస ముతో ముద్దులొలుకు రచనాసంవిధానముతో వీరికృతులు నెగడు చుండును. వీనిలో నొకకొన్నిమాత్రమే ముద్రితములై యున్నవి. ఇట్టి మహోత్కృష్ట గ్రంథరాజములను జక్కగ సేకరించి వానికగు సంస్కరణమునం దతిశ్రద్ధాభక్తులను బెంపొందించికొని సంఘసారస్వతసేవా లక్ష్యముతో ననవరతము నప్రమత్తకృషిని సాగించుచు నాఁబోటి సామాన్యునకు సైతము స్వమతస్వరూపాభిమానములను మనోవీథిని రేకెత్తించు మాననీయులగు మతాచార్యపురుషులకు సంస్కృతిసేయఁ గల యదృష్టమును జిక్కించినందులకు శ్రీభగవచ్ఛాస్త్రపారీణులగు శ్రీమాన్ దేవయజనం వేంకటరామాచార్యులవారికిని, భగవచ్ఛాస్త్ర గ్రంథమాలానిర్వాహకులగు శ్రీమాన్ భిషగ్రాజ దీవి వేంకటనర సింహాచార్యులవారికిని సర్వదా కృతజ్ఞుఁడనై సరసహృదయసహృదయ పరిశీలనార్థ మియ్యది నివేదించుకొనుచున్నాఁడను.

గుంటూరు.
అరండల్‌పేట
6-3-1948

ఇట్లు
శ్రీవైఖానసాభిజనకృపాకాంక్షి,
కవికిశోరపండావన లలితభారతిసాహిత్యభూషణ,
దీవి శ్రీలక్ష్మీనరసింహాచార్యులు

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

# పీఠికా

విదిత మేవేదం విదుషాం తత్ర శ్రీవైఖానసకల్పసూత్రభగవచ్ఛాస్త్రప్రయోగవినియుక్తానా మష్టసు ప్రశ్నేషు సంగృహీతానాం భగవతా విఖనసా దృష్టానాం మన్త్రవిశేషాణాం పార్థక్యేన పాఠః ప్రసిద్ధ ఇతి, సోయం మన్త్రపాఠః శ్రీవైఖానసేషు రూఢప్రచారో జాగర్తి చ. అత్ర ప్రకృతో మూలగ్రన్థః తన్మన్త్రపాఠాన్తఃపాతి సప్తమప్రశ్నత్వేన పరిగణితః, పారమాత్మికః ప్రశ్నః. అస్య చ ప్రశ్నస్య పారమాత్మికవ్యవహారః భగవచ్ఛాస్త్రనిర్మాతృభి ర్భృగుమరీచ్యత్రికశ్యపైః పరమర్షిభి రాదౌ ప్రవర్తితః. యథావిమానార్చనకల్పే భగవాన్మరీచిః :

"అథాతః పారమాత్మికానుక్రమణ మిత్యారభ్య విష్ణుః సర్వేషా మిత్యాది పఞ్చోత్తరశతం పారమాత్మిక మితి విజ్ఞాయతే (32) పటలే ఇత్యనేన తథా, పౌణ్డరీకే శతం పద్మ మాహృత్య కపిలాఘృతే సమాప్లుత్య విష్ణుగాయత్ర్యా ప్రత్యేకం హుత్వా, పద్మాలాభే బిల్వపత్రేణ వాఽఽజ్యేన విష్ణుః సర్వేషా మిత్యారభ్య మామాత్మగుప్తా మితి పారమాత్మిక దేవేశం ధ్యాయన్ జుహుయాత్, కాశ్యపే (68) అధ్యాయే. ఇత్యనేన అపి చాత్రాపాత్య పఞ్చోత్తర శతం మన్త్రాణా మేకాదశ స్వనువాకేషు సఙ్గ్రథితమ్, యత్ర దశ స్వాద్యేషు, ఏకైకస్మి న్దశదశ తథైకాదశే చానువాకే పఞ్చ చ మన్త్రా స్సఙ్గృహీతాః. ఏషు చ మన్త్రేషు కతిచన దశావతారకల్పే అవతారప్రధానమన్త్రత్వేన పఠ్యన్తే, మన్త్రాశ్చ తాదృశాః, తథా ప్రయోగే వినియుజ్యన్తే చ. కృత్స్నశ్చ ప్రశ్నః మహాప్రతిష్ఠాయాం మహాశాన్తిహోమేషు చ ప్రాధాన్యేన వినియుజ్యతే,

ఇత్థం, అస్య మన్త్రభాగస్య ఉపనిషత్త్వకథనం చోక్తాన్యేయ పారమాత్మికత్వవ్యవహారమూలక మేవ భవితు మర్హతి. యతః

స్తత్రౌపనిషదపురుషస్య పరంబ్రహ్మణో మహావిష్ణో స్స్వరూపరూప గుణవిభవైశ్వర్యశీలాదయః కల్యాణగుణాః, చిదచితో స్స్వరూపాదికం చేతనస్య సంసారబన్ధమోక్షపూర్వక బ్రహ్మభూయత్వప్రాప్తయే భగవదారాధనోపయిక స్వాత్మభరసమర్పణ ప్రకారశ్చేత్యంశాః ప్రతిపాద్యన్తే.

అత్రాద్యాదిదశ స్వనువాకే షూక్తార్థ ఏవ యథాక్రమేణ ఈశాదిషు దశ సూపనిషత్సు వ్యాఖ్యాతా ఇతి ఏకాదశానువాక శ్చోక్తార్థసఙ్గ్రహ ఇత్యాచార్యాణాం సమయః తమేవ మనసి నిధాయ భగవాన్భాష్యకారః మన్త్రస్థస్వాహాశబ్దం వ్యాచష్టే, స్వాహా శబ్దేన నమశ్శబ్దః ప్రతిపాదితః అనేన ప్రపత్తిః ప్రతిపాదితా ............ ఏతత్సర్వ మేకాదశానువాకే విస్తరేణ వక్ష్యతే (పు ౬) ఇతి.

అయం చ ప్రశ్నః భగవచ్ఛ్రీనివాసముఖ వేదాన్తదేశికైః తథా భాస్కరభట్టాచార్యైశ్చ విభిన్నాకారపాఠద్వయ మహరుధ్య వ్యాఖ్యాద్వయం ప్రాణాయి తత్ర ఆశ్యత్వే ఉపనిషత్ భాష్యత్వేన ప్రసిద్ధిః, ప్రాచుర్యం చ దృశ్యతే. శ్రీదీక్షితేన్ద్రజీవితచరితం జగద్విదిత మేవ, అథాపి తదీయకృతిషు తిథినిర్ణయకారికాభిధనిబన్ధస్యాస్తి ముగద్యేన విశదతరం బోధ్యత ఇతి తత్ప్రకార ఇహ నివేశ్యతే యథా.

ఇతి కౌశికగోత్రేణ గోవిన్దాచార్యసూనునా
శ్రీవేఙ్కటేశపాదాబ్జసమారాధనశాలినా
తద్దత్తవేదవేదాన్తదేశికాఖ్యేన ధీమతా
సర్వతన్త్రస్వతన్త్రేణ గర్భచక్రాఙ్కజన్మనా
శ్రీవైఖానసనిష్ఠేన శ్రీనివాసార్యయజ్వనా
రచితా పరిపూర్ణేయం తిథినిర్ణయకారికా,

(1876) సం॥ ముద్రణే.

విశేషాశ్చ ఇలత్తూర్ సున్దరరాజసూరిప్రణీతదీక్షితేన్ద్రచరిత్రాదవధేయాః.

భాష్యవ్యాఖ్యాకర్తా చ తత్రభవా న్వరదరాజనన్దనః సున్దరరాజసూరిః శాలివాటీనగరపరిసరవర్తి యిలత్తూరాఖ్య మగ్రహార మధ్యుష్య శతసఙ్ఖ్యాధికప్రబన్ధనిర్మాణేన సంస్కృతవాఙ్మయ ముపస్కృత్య సమీప ఏవ శోభకృద్వత్సరే దివ మలంచకార. తదీయా శ్చేమం తత్స్మారకశ్లోక మత్ర మనుసన్దధతి.

శోభకృదబ్దే భాస్వతి భాస్వతి మకరే సితపక్షే చతుర్థ్యామ్
సున్దరరాజకవీన్ద్రో గౌరవవారే యయౌ పరం స్థానమ్॥ ఇతి

తదీయం చ పావనచరితం తదీయైః మహాకవివరదరాజభట్టాచార్యైః ప్రబన్ధరూపేణ నిర్మితం మద్రపుర్యాం ద్రామిడాక్షరై ర్ముద్రాప్య ప్రకాశితం వర్తతే.

భాస్కరభట్టాచార్య శ్చ, మహీశూరసంస్థానా న్తర్గతమూష్టిగ్రామ వాసీ షట్శతవర్షేభ్యః ప్రా గిమాం పుణ్యభూమి మధ్యువాస. తత్కృతిషు శ్రీవైఖానసఖిలమన్త్రవ్యాఖ్యాన మేక మేవోపలభ్యతే. తత్రాయం గ్రన్థ స్సప్తమప్రశ్నవ్యాఖ్యారూపః. అయం తు దీక్షితీయభాష్య ద్భిన్నప్రక్రమవాన్ ఉపనిషదర్థస్పర్శీ చ దృశ్యతే, అస్య చరితం చ కేనచన ప్రాచీనలిఖితేన జ్ఞాయతే.

ఏతద్గ్రన్థపరిశీలనేన ఆత్మానం కృతార్థం మన్యమాన స్సహృదయేభ్యో నివేదయామి స్వానుభూతిమ్.

కిఞ్చ సారస్వతసేవాయాం నియుక్తానాం శ్రీమతాం దేవయజనం వేఙ్కటరామాచార్యాణాం శ్రీవైఖానసభగవచ్ఛాస్త్రగ్రన్థమాలాధికారిణాం భిషగ్రాజ శ్రీపి వేంకటనృసింహాచార్యాణాం చ కృతజ్ఞతాఽనేన నివేద్యతే.

శ్రీవైఖానసవిద్యాలయమ్.
ఆకులమన్నాడు.
సర్వజిద్వత్సర పుష్య శుద్ధ
తృతీయా భానువాసరః

ఇతి సజ్జనవిధేయః
రాం॥ భ॥ పా॥ కృ॥

శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథమాలా

## మహారాజ పోషకులు

శ్రీమాన్ భిషగ్రాజ దీవి వేంకటనృసింహాచార్యులు గారు — నల్లూరు

,, నారాయణం వెంకటాచార్యులవారి కుమాళ్ళు

,, శ్రీనివాసాచార్యులు గారు — సంగంజాగర్లమూడి

,, సత్యనారాయణాచార్యులు గారు — సంగంజాగర్లమూడి

## రాజపోషకులు

శ్రీమాన్ తమిరిశ రామాచార్యులు గారు — తెనాలి

## ప్రధానపోషకులు

శ్రీమాన్ దీవి రాఘవాచార్యులు గారు — నల్లూరు

,, వేదాంతం రాజగోపాలాచార్యులు గారు — పొరంకి

,, ఘనపాఠి వేదాంతం శ్రీనివాసాచార్యులు గారు — పొరంకి

## అభిమానపోషకులు

శ్రీమాన్ అగ్నిహోత్రం అప్పలాచార్యులు గారు — చిలువోల్లంక

,, ,, కృష్ణమాచార్యులు గారు — తెనాలి

,, ,, రామకృష్ణమాచార్యులు గారు — బోడాయిపాలెం

,, ,, సీతారామాచార్యులు గారు — పేటేరు

* ,, ,, పట్టాభిరామాచార్యులు గారు — పెదప్రోలు

* ,, ,, రాధాకృష్ణమాచార్యులుగారు — కొత్తపాలెం

,, అర్చకం టి.ఆర్. దొరసామిభట్టాచార్యులుగారు<br>శ్రీ వెంకటేశపెరుమాళ్ దేవస్థానం. పరంపరమిరాశీ.స్థానికం } మద్రాసు

,, అర్చకం శ్రీనివాసభట్టాచార్యులు గారు — మదనమంగళం

,, ఉద్దండరాయణం వెంకటబుచ్చయాచార్యులు గారు — చిలుకోడు

| | |
|---|---|
| శ్రీమాన్ గుడిపూడి రంగాచార్యులు గారు ........ | [illegible]రుమిల్లి |
| ,, గుడిపూడి బ్రహ్మాచార్యులు గారు | [illegible]రుమిల్లి |
| ,, తమిరిశ పానకాలాచార్యులు గారు | [illegible]దరావూరు |
| ,, దీవి అనంతశేషాచార్యులు గారు | నల్లపాడు |
| ,, దీవి వేంకటనృసింహాచార్యులు గారు | నల్లూరు |
| ,, ,, లక్ష్మణాచార్యులు గారు | నల్లూరు |
| ,, ,, సీతారామాచార్యులు గారు | మూరతోట |
| ,, ,, శ్రీనివాసాచార్యులు గారు | రేమాలవారిపాలెం |
| ,, ,, వేంకటనరసింహాచార్యులు గారు | ,, |
| ,, ,, వేంకటాచార్యులు గారు | వేకనూరు |
| ,, ,, వేంకటరామాచార్యులు గారు | నాగాయిలంక |
| ,, ,, కేశవాచార్యులు గారు | వేకనూరు |
| ,, ,, శ్రీరామాచార్యులు గారు | ,, |
| ,, ,, నరసింహాచార్యులు గారు | భావుదేవరపల్లి |
| ,, ,, అప్పలాచార్యులు గారు | హంసలదీవి |
| ,, ,, లక్ష్మినరసింహాచార్యులు గారు | అవనిగడ్డ |
| ,, ,, నరసింహాచార్యులు గారు | ,, |
| ,, ,, రామకృష్ణమాచార్యులు గారు | రాచూరు |
| ,, ,, రంగాచార్యులు గారు | గోవాడ |
| ,, ,, లక్ష్మణాచార్యులు గారు | యలవర్రు |
| ,, ,, వేంకటసీతారామాచార్యులు గారు | కొల్లూరు |
| ,, ,, లక్ష్మినారాయణాచార్యులు గారు | విలూరు |
| ,, ,, నరసింహాచార్యులు గారు | పెదపులివర్రు |
| ,, నల్లూరు నారాయణాచార్యులు గారు | నల్లూరు |
| ,, ,, నరసింహాచార్యులు గారు | నల్లూరుపాలెం |
| ,, ,, గోపాలాచార్యులు గారు | రేపల్లె |
| ,, ,, తిరువెంగళాచార్యులు గారు | ,, |

శ్రీమాన్ నల్లూరి వేంకటనరసింహాచార్యులు గారు కారుమూరు
* ,, ,, శేషాచార్యులు గారు ఉల్లిపాలెం
,, నారాయణం శేషాచార్యులు గారు రేపల్లె
,, ,, రామానుజాచార్యులు గారు ఉల్లిపాలెం
,, ,, శ్రీరామాచార్యులు గారు ,,
,, ,, పురుషోత్తమాచార్యులు గారు కొమ్మమూరు
,, ,, పెదభావనాచార్యులు గారు ఎరుకలపూడి
,, పరాశరం మంగాచార్యులు గారు తెనాలి
,, పి. ఆర్. రామకృష్ణభట్టాచార్యులు గారు
స్థానికం, విల్లివాకం మద్రాసు
,, బృందావనం వెంకటరంగాచార్యులు గారు
శ్రీచన్న కేశవాయుర్వేదఫార్మసీ బందరు
,, ,, వెంకటనారాయణాచార్యులు గారు
శ్రీలక్ష్మీనరసింహాయుర్వేదఫార్మసీ చమ్మనగిరిపేట, బందరు
,, మాల్యవంతం కృష్ణమాచార్యులు గారు నారాకోడూరు
,, ముత్తేవి శేషాచార్యులు గారు
శ్రీమారుతీ ఆయుర్వేదనిలయం చమ్మనగిరిపేట, బందరు
,, ,, నరసింహాచార్యులు గారు బచ్చుపేట, బందరు
,, రొంపిచర్ల భట్టర్ తాతాచార్యులు గారు క్రాప
,, ,, ,, వేంకటాచార్యులు గారు ఉప్పూడి
,, ,, ,, రామకృష్ణమాచార్యులు గారు దుగ్గిరాల
,, వేదాంతం నారాయణాచార్యులు గారు వుయ్యూరు
,, ,, సత్యనారాయణాచార్యులు గారు మల్లవోలు
,, శ్రీనివాసుల వెంకటకృష్ణమాచార్యులు గారు బ్రాహ్మణకోడూరు
,, స్థానికం సుందరరాజభట్టాచార్యులు గారు
పెద్దినాయకంపేట, మద్రాసు
,, ,, అనంతభట్టాచార్యులు గారు శ్రీపెరుంబూదూరు

5. పోషకులు

| | |
|---|---|
| శ్రీమాన్ అగ్నిహోత్రం వేంకటాచార్యులు గారు | చోడాయిపాలెం |
| ,, అగ్నిహోత్రం రంగాచార్యులు గారు | చోడాయిపాలెం |
| ,, తమిరిశ రాఘవాచార్యులు గారు | తెనాలి |
| ,, దీవి ఆంజనేయాచార్యులు గారు | పెదపులివఱ్ఱు |
| ,, దీవి వరదాచార్యులు గారు | పెదపులివఱ్ఱు |
| ,, దీవి హనుమాచార్యులు గారు | చీరాల |
| ,, దీవి సీతారామచార్యులు గారు | కొలకలూరు |
| ,, దీవి శ్రీనివాసాచార్యులు గారు | రావూరు |
| ,, నల్లూరు ఆనందాచార్యులు గారు | ఓలేరు |
| ,, నారాయణం పెదరాఘవాచార్యులు గారు | మునుకుదురు |
| ,, పరాశరం సీతారామాచార్యులు గారు | వేజెండ్ల |
| ,, డాక్టర్ పరాశరం వెంకటాచార్యులు గారు | అమృతలూరు |
| ,, పరాశరం వెంకట దేశికాచార్యులు గారు | ఈమని |
| ,, పెద్దింటి లక్ష్మీనరసింహాచార్యులు గారు | నర్సాపురం |
| ,, పెద్దింటి చినముత్యాల వెంకటాచార్యులు గారు | అంతర్వేది |
| ,, పెద్దింటి తిరుమలాచార్యులు గారు | గంగవరం |
| ,, చోడపల్లి వెంకటాచార్యులు గారు | అంతర్వేది |
| ,, వేదాంతం లక్ష్మణాచార్యులు గారు | చోడవరం |
| ,, వేదాంతం వెంకటేశ్వరాచార్యులు గారు | బల్లిపఱ్ఱు |
| ,, వేదాంతం రాఘవాచార్యులు గారు | తక్కెళ్ళపాడు |
| ,, ,, లక్ష్మీనారాయణాచార్యులు గారు | జలాలీపేట, బందరు |
| ,, శ్రీభాష్యం శేషాచార్యులు గారు | తెనాలి |
| ,, శ్రీనివాసుల అనంతశేషాచార్యులు గారు | నందివెలుగు |

6 సహాయకులు

| | |
|---|---|
| శ్రీమాన్ అగ్నిహోత్రం రాజగోపాలాచార్యులుగారు | శ్రీకాకుళం |
| ,, అగ్నిహోత్రం కృష్ణమాచార్యులుగారు | పోలవరం |
| ,, అద్దేపల్లి హనుమాచార్యులు గారు | అద్దేపల్లి |

| | |
|---|---|
| శ్రీమాన్ గోవర్ధనం వెంకటరాఘవాచార్యులు గారు | శనివారప్పేట |
| ,, గోవర్ధనం శేషాచార్యులు గారు | పెదపట్ణం |
| ,, తమిరిశ సీతారామాచార్యులు గారు | తెనాలి |
| ,, తమిరిశ శేషాచార్యులు గారు | దోనేపూడి |
| ,, దీవి వెంకటాచార్యులు గారు | రేమాలవారిపాలెం |
| ,, దీవి చిన వెంకటాచార్యులుగారు | పెదపులివర్రు• |
| ,, దీవి లక్ష్మీనరసింహాచార్యులుగారు | అద్దేపల్లి |
| ,, దేవయజనం వెంకటనరసింహాచార్యులు గారు | తూములూరు |
| ,, నల్లూరు రంగాచార్యులు గారు | బాపట్ల |
| ,, నల్లూరు వెంకట్రామాచార్యులు గారు | ముక్తిపల్లిఅగ్రహారం |
| ,, నల్లూరు కోదండరామాచార్యులు గారు | ,, |
| ,, నారాయణం రామానుజాచార్యులు గారు | తెనాలి |
| ,, నారాయణం శేషాచార్యులు గారు | జమ్ములపాలెం |
| ,, నారాయణం రంగభట్టాచార్యులు గారు | మండూరు |
| ,, నారాయణం శ్రీనివాసాచార్యులుగారు | మండూరు |
| ,, పరాశరం శేషాచార్యులు గారు | కొల్లిపర |
| ,, పెద్దింటి వేంకటనరసింహాచార్యులు గారు | రేపల్లె |
| ,, ముత్తేవి రాధాకృష్ణాంజనేయాచార్యులుగారు | పెదకళ్లేపల్లి |
| ,, రొంపిచర్ల భట్టర్ హనుమాచార్యులుగారు | దోనెపూడి • |
| ,, ,, సీతారామాచార్యులుగారు | దోనెపూడి |
| ,, ,, కృష్ణమాచార్యులు గారు | కొడాలి |
| ,, ,, పట్టాభిరామాచార్యులు గారు | కొడాలి • |
| ,, ,, జగన్నాథాచార్యులు గారు | భృగుబండ |
| ,, వేదాంతం గోపాలాచార్యులు గారు | వేజండ్ల |
| ,, ,, యోగానందనృసింహాభట్టాచార్యులుగారు | వేదాద్రి |
| ,, సుదర్శనం అనంతభట్టాచార్యులు గారు | నర్సాపురం • |

• ఈగుర్తు వేసిన పేర్లవారు చందా యివ్వలేదు.

    

శ్రియై నమః
శ్రీశ్రీనివాసపరబ్రహ్మణే నమః
శ్రీవిఖనోమునయే పరమగురవే నమః

# శ్రీ పారమాత్మికోపనిషద్భాష్యమ్

(ప్రథమోఽనువాకః)

---

శ్రీలక్ష్మీవల్లభారమ్భాం విఖనోమునిమధ్యమామ్
అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్

ఓమ్, విష్ణు స్సర్వేషా మధిపతిః పరమః పురాణః ।
సతోలో కానా మజితో జితాత్మ న్భవతే భవాయ స్వాహా॥౧॥

## శ్రీ పారమాత్మికోపనిషద్భాష్యప్రారమ్భః

శ్రీ వేఙ్కటేశ మఖిలేశ మనన్త మాద్యమ్
సృష్టిస్థితిప్రళయహేతు మహేతు మీడ్యమ్
శ్రీపారమాత్మికమనుప్రతిపాద్యరూపమ్
ధ్యాయామి ముక్తిద మహం చిదచిచ్ఛరీరమ్॥

శ్రీమత్కౌశికగోత్రేణ శ్రీగోవిన్దార్యసూనునా
శ్రీవేఙ్కటేశపాదాబ్జసపర్యానిరతాత్మనా॥

వేదాన్తాచార్యవర్యేణ శ్రీనివాసార్యయజ్వనా
సంస్కృతాన్ధ్రతన్త్రేణ వేదవేదాఙ్గవేదినా॥

శ్రుతిస్మృతిపురాణానాం సమీచీనార్థదర్శినా
పారమాత్మికమోపనిషద్భాష్యం సమ్యగ్విరచ్యతే।
శ్రీపారమాత్మికపయోధి మయం విమథ్య
ధీమన్దరేణ విఖనోమునిసత్ప్రసాదాత్
పీయూష ముద్ధరతి సర్వజగద్ధితార్థీ
సమ్యక్పిబన్తు విబుధా భవతాపశాన్త్యై॥

" సహ నా వవ త్వితి శాన్తిః "

తత్రాయ మాద్యో మన్త్రః విష్ణు స్సర్వేషామితి

విష్ణుః సర్వవ్యాపనః "యచ్చ కిఞ్చి జ్జగ త్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపివా। అన్త ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" ఇతి శ్రుతేః.

"విశ్వవ్యాపనశీలత్వా ద్విష్ణు రిత్యుచ్యతే బుధైః" రితిచ. సన్వాదౌ తావ త్పరంబ్రహ్మ పరంజ్యోతిః పరంతత్త్వ పరమాత్మాది శబ్దా విన్యస్తే చే త్పారమాత్మికం భవతి.

ఉపక్రమోపసంహారా వభ్యాసో ఽపూర్వతా ఫలమ్
అర్థవాదోపపత్తీ చ లిఙ్గం తాత్పర్య నిర్ణయే॥

ఇతివదనాత్. అస్య కథం పారమాత్మికత్వ మితి చే దుచ్యతే.

అష్టాక్షరశ్చ యో మన్త్రో ద్వాదశాక్షర ఏవచ
షడక్షరశ్చ యో మన్త్రో విష్ణో రమితతేజసః
ఏతే మన్త్రాః ప్రధానాస్తు వైదికాః ప్రణవై ర్యుతాః
ప్రణవేన విహీనాస్తు తాన్త్రికా ఏవ కీర్తితాః ॥ ఇతి.

భగవన్మన్త్రే ష్వవ్యాపకమన్త్రాపేక్షయా వ్యాపకమన్త్రాః ప్రధానాః. వ్యాపకమన్త్రేషు చాష్టాక్షరషడక్షరౌ. అష్టాక్షరేణ ప్రతిపాద్యో నారాయణః, షడక్షరేణ ప్రతిపాద్యో విష్ణుః. ప్రధానభూతనారాయణవిష్ణు [illegible]

పరంబ్రహ్మపరంజ్యోతిఃపరంతత్త్వపరమాత్మాదిశబ్దైః పర్యాయవాచకైశ్చ. శ్రియఃకాన్తత్వా న్నిఖిల ఏవ విష్ణుశబ్దప్రయోగః. కిఞ్చ "విష్ణో రంశస్తు పురుష" ఇతి. ద్వైవిధవ్యూహభూతస్య పురుషస్య, మానుషవ్యూహభూతస్య వాసుదేవస్య చ మూలభూతత్వాత్ విష్ణుశబ్దగ్రహణమ్. యద్వా సర్వత్రాఽపి పరంబ్రహ్మ పరంజ్యోతిః పరంతత్త్వపరమాత్మాదిశబ్దప్రయోగాత్, అద్వారకత్వేన సద్వారకత్వేన చ భగవల్లీలాప్రతిపాదకత్వాత్, భగవత్ప్రాదుర్భావా విర్భావలీలా ప్రతిపాదకత్వాచ్చ. సర్వేషా మధిపతిః సర్వేషాం బ్రహ్మరుద్రాదీనాం, నిత్యముక్తబద్ధానాం, సర్వశబ్దస్య సఙ్కోచాభావా దణ్డాన్తర్వర్తిచేతనాచేతనవర్గాణా, మణ్డా ద్బహిర్భూతానా, మప్యధిపతిః. "పతిం విశ్వస్యాత్మేశ్వర" మితిశ్రుతేః. శ్వేతాశ్వతరే: "పతిం పతీనాం పరమం పరస్తా ద్విదామ దేవం భువనేశ మీడ్య" మితి.

"బ్రహ్మాదిదేవసఙ్ఘేషు స ఏవ పురుషోత్తమః
శ్రీప్రాయ మితర త్సర్వం జగ ద్బ్రహ్మపురస్సర''మితి.

పరమః (పరోమా) పరామా అస్యేతిపరమః సమాభ్యధికరహితః. యద్వోత్కృష్టః. పురాణః అనాదిః పరో లోకానామ్.

"ఏకతో వా జగత్సర్వ మేకతో వా జనార్దనః
సారతో జగతః కృత్స్నా దతిరిక్తో జనార్దన" ఇతి.

అజితః బ్రహ్మరుద్రాదిభి ర్జేతు మశక్య ఇత్యర్థః. యద్వా "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహే"తి శ్రుతే రవాఙ్మనసగోచరత్వా ద్యోగిభి రప్యజితః.

నారసింహపురాణే

"హిరణ్యకశిపో స్త్రాసి తేన్ద్రా దేవా బృహస్పతిః
క్షీరోద స్యోత్తరం గత్వా స్తూయతాం తత్ర కేశవః
యుష్మాభి స్సంస్తుతో విష్ణుః ప్రసన్నో భవతి క్షణాత్"

ఇత్యారభ్య హిరణ్యకశిపువధానన్తరం

తస్య కోపాభిభూతస్య నృసింహస్య జగత్పతేః
దృష్ట్వా భయానకం రూపం తత్రసు ర్దేవదానవాః"

ఇత్యారభ్య, శరభనిర్మాణాదికం ప్రతిపాద్యతే.

"తత స్తస్య భవానీశ స్తుణ్డస్థాన మరోచత
పృష్ఠభాగే చతుర్వక్త్రం తస్య రుద్రో న్యవేశయత్
సోమసూర్యౌ నయనయో ర్మారుతం పక్షయో ర్ద్వయోః
పాదేషు భూధరా న్సర్వాన్ శివ స్తస్య న్యవేశయత్
ఏవం నిర్మాయ శరభం భవః ప్రమథనాయకః
జగర్జ నరసింహం తం సముద్దిశ్య భయానకమ్
తతః క్షణేన శరభో నాదపూరితదిఙ్ముఖః
అత్యాశ మగమ ద్విష్ణో ర్భినద న్నైభరవస్వనమ్
త మభ్యాశగతం దృష్ట్వా నృసింహ శ్శరభం రుషా
జఘాన శితై రుగ్రై స్తీక్ష్ణై ర్నఖవరాయుధైః
నిహతే శరభే తస్మిన్ రౌద్రే మధునిఘాతినా
తుష్టువుః పుణ్డరీకాక్షం దేవా దేవర్షయ స్తథా" ఇతి —

భవాయ రుద్రాయ అజితః రుద్రేణా ప్యజిత ఇత్యర్థః. హేజితాత్మన్ "అహం భక్తపరాధీనో హ్యస్వతన్త్ర ఇవ ద్విజ" ఇతి వచనాత్, "భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున" ఇతి భగవద్వచనాచ్చ. యద్వా పరశురామమన్త్రిత్వాత్ రామభద్రేణ జితాత్మన్. యద్వా స్వభక్తస్య భీష్మస్య ప్రతిజ్ఞాపరిపాలనార్థం జగద్రక్షణార్థం చ, భవాయ ఉత్పన్నాయ భవతే తుభ్యం స్వాహా "స్వాహా స్వధా వష డ్వౌష ణ్ణమః పర్యాయవాచకాః"

"ఓమితి బ్రహ్మణో యోని ర్నమ స్స్వాహా స్వధా వషట్.
యస్యైతాని ప్రయుజ్యన్తే యథాశక్తి కృతా న్యపి
న తస్య త్రిషు లోకేషు పరం లోకే సమం విదుః
ఇతి వేదా వదన్తి స్మ వృద్ధాశ్చ పరమర్షయః" ఇతి భారతే

"నమస్స్వాహా స్వధా వషట్ వౌషట్ హుం ఫట్ శబ్దాః పర్యాయవాచకాః." "స్వధా నమ ఇతి వషట్కరోతీతి శ్రుతేశ్చ"

నమశ్శబ్దః ప్రదానార్థ స్స్వాహాశబ్ద ఇవేత్యత ఇతి

స్వాహాశబ్దేన నమశ్శబ్దః ప్రతిపాదితః అనేన ప్రపత్తిః ప్రతిపాదితా.

"లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా
రక్షక స్సర్వసిద్ధాన్తే వేదాన్తేషు చ గీయతే
లక్ష్మ్యా మమ చ శేషాహి విభూతి రుభయాత్మికా ॥"

"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"

"లక్ష్మీ విశిష్ట ఏవైకః ప్రపత్తవ్య ఇహోదితః" ఇతి

లక్ష్మీవిశిష్ట ఏవ ప్రపత్తవ్య ఇత్యభిప్రాయేణాదౌ విష్ణుశబ్దః. ఏతత్సర్వ మేకాదశాఽనువాకే విస్తరేణ వక్ష్యతే ॥౧॥

శ్రీమత్పారమాత్మికోపనిషద్భాష్యచన్ద్రికా ప్రారమ్భః

—శ్రీమత్సున్దరరాజేన వన్దిత్వా రఘునన్దనమ్
పారమాత్మికభాష్యాబ్ధే శ్చన్ద్రికేయం విరచ్యతే ॥

ఇహ ఖలు తత్రభవాన్ భగవాన్ సకలకలాభిజ్ఞసార్వభౌమః సర్వతన్త్రస్వతన్త్రశ్రీనివాసకృపాలబ్ధవేదాన్తదేశికాభిఖ్యః కర్మబ్రహ్మప్రతిపాదకకల్పసూత్రబ్రహ్మసూత్రాదీనాం భాష్యకార శ్రీనివాసాధ్వరీన్ద్ర స్సకలచేతనోద్దిధీర్షయా సర్వోపనిషత్సారభూతాం శ్రీపారమాత్మికోపనిషదం వ్యాచిఖ్యాసుః ప్రారిప్సితవ్యాఖ్యానస్య నిర్విఘ్నపరిసమాప్త్యర్థం శిష్టాచారానుమితశ్రుతిబోధితేతికర్తవ్యతాకం స్వేష్టదైవతశ్రీవేఙ్కటాచలనాథధ్యానరూపం మఙ్గళ ముపనిబధ్నాతి శ్రీవేఙ్కటేశ మితి. శ్రీవేఙ్కటేశం శ్రియా నిత్యానపాయిన్యా సర్వజనన్యా మఙ్గళదేవతయా నిత్యయుక్తం, అఖిలేశం న కేవలం వేఙ్కటాచలస్యేశః కిన్తు అఖిలస్యాపి చరాచరప్రపఞ్చస్యేశో నియన్తా. తం అనన్తం త్రివిధ

పరిచ్ఛేదరహితం. ఆద్య మాదా భవం సృష్టిస్థితిప్రళయహేతుం జగజ్జన్మస్థితిప్రళయానా మభిన్ననిమిత్తోపాదానకారణం. యతో వా ఇమానీత్యాదిశ్రుతేః. అహేతుం స్వోత్పాదకకారణరహిత మిత్యర్థః. ఈడ్యం బ్రహ్మరుద్రాదీనా మపి స్తవనీయం. తమీశ్వరాణా మిత్యాది శ్రుతేః. శ్రీపారమాత్మికమనుప్రతిపాద్యమానం స్వవ్యాఖ్యాస్యమాన శ్రీపారమాత్మికోపనిషత్సర్వమన్త్రాణాం ప్రమేయభూత మిత్యర్థః. ముక్తిదం మోక్షప్రదం. ముక్తేః ప్రదాతుర న్యేషాం పురుషాణాం దాతృత్వే కైముతికన్యాయసిద్ధమ్. చిదచిచ్ఛరీరం సకలచేతనాచేతనప్రపఞ్చశరీర మిత్యర్థః. ఏవ మఖిలహేయప్రతిభటపరమకల్యాణగుణగణమహోదధి మర్చారూపిణం నిరుపాధికభగవచ్ఛబ్దశబ్దితం శ్రీనివాసం. అహం వక్ష్యమాణస్వరూపగుణః. ధ్యాయామి ఉపాయోపేయభూతత్వేన నిరన్తరం తద్ధ్యానపరో భవామీత్యర్థః.

ఏవం స్వాభీష్టదైవశ్రీవేఙ్కటనాథధ్యానరూపమఙ్గళాచరణానన్తరం స్వగ్రన్థస్యోపాదేయతాసిద్ధయే స్వస్య యోగ్యతాప్రదర్శనపూర్వకం భాష్యగ్రన్థారమ్భం ప్రతిజానీతే శ్రీమత్కౌశికగోత్రేణేత్యాది శ్లోకత్రయేణ. అత్ర శ్రీమత్కౌశికగోత్రేణేత్యనేన ఐశ్వర్యతపోఽభిజాత్యాదిసంపత్తి స్సూచ్యతే. శ్రీగోవిన్దార్యసూనునేత్యనేన పారంపర్యేణ పరమభాగవతాగ్రగణ్యత్వం ద్యోత్యతే. శ్రీవేఙ్కటేశపాదాబ్జసపర్యానిరతాత్మనేత్యనేన విషయాసక్తినిరసనపూర్వక శ్రీమన్నారాయణైకతత్పరత్వం జ్ఞాప్యతే. వేదాన్తాచార్యవర్యేణేత్యనేన భగవదనుగ్రహప్రాప్తవేదాన్తదేశికాఖ్యబిరుదాఙ్కితత్వం గమ్యతే. శ్రీనివాసార్యయజ్వనేత్యనేన సర్వశాస్త్రాచరణప్రచారణాదికం ప్రఖ్యాప్యతే. సర్వతన్త్రస్వతన్త్రేణేత్యనేన చతుష్షష్టికలానిరతిశయప్రావీణ్యం ప్రతిపాద్యతే. వేదవేదాఙ్గవేదినేత్యనేన సాఙ్గసకలవేదషడ్దర్శనీపారఙ్గతత్వం నివేద్యతే. శ్రుతిస్మృతిపురాణానాం సమీచీనార్థదర్శినేత్యనేన శ్రుత్యాదిసకలవాఙ్మయానాం పరస్పరావిరుద్ధతాత్పర్యవిషయీభూతార్థనిర్ణాయకత్వం ప్రకాశ్యతే. ఏవ మేతాదృశవిశేషణ

